# గురు శిష్య సంబంధాలు:
# పూర్వాదర్శాలు, ప్రస్తుతపరిస్థితులు

జగద్గురువులు
శ్రీ శృంగేరీ పీఠాధిపతుల
ప్రసంగాలు



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ
ప్రాచ్య పరిశోధనాలయము
తిరుపతి
1978

# గురు శిష్య సంబంధాలు : పూర్వాదర్శాలు, ప్రస్తుతపరిస్థితులు

జగద్గురువులు

శ్రీ శృంగేరీ పీఠాధిపతుల

ప్రసంగాలు




శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ

ప్రాచ్య పరిశోధనాలయము

తిరుపతి

1978

## విషయ సూచిక

# ఒక మాట

దక్షిణామ్నాయ శ్రీ శృంగేరీ శారదాపీఠాధిపతులు, శ్రీ జగద్గురు అభినవవిద్యాతీర్థమహాస్వామివారు, శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామివారున్ను, నా ఆహ్వానంపై శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి నవంబరు 18, 1977 నాడు విజయం చేశారు. వారు ఇందలి ప్రాచ్య పరిశోధనాలయంలోను, సంస్కృతశాఖలోను సాగుతున్న గవేషణను పరిశీలించి, యూనివర్సిటీ గ్రంథాలయాన్ని తిలకించి, సెనేట్ హాలులో భాషించారు. గురు శిష్య సంబంధాల్ని గురించి మననానికి యోగ్యాలైన భావాలను వారు వెలిబుచ్చారు. అందుచేత, రికార్డు చేయబడిన వారి ప్రసంగాలను ఈ పుస్తక రూపంగా ప్రకటిస్తున్నాము. ఇవి చిరకాలం ఉపాధ్యాయులకు, విద్యార్థులకు ఎంతో ఉపయోగకరంగాను, ఆచరణీయాలు గాను ఉంటయి.

తిరుపతి<br>మే 12, 1978<br>శ్రీ శంకరజయంతి

కె. సచ్చిదానందమూర్తి<br>ఉపకులపతి<br>శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

श्रीभगवत्पादप्रतिष्ठापितशृङ्गगिरिशारदापीठाधिपतीनां
जगद्गुरूणां श्रीमदभिनवविद्यातीर्थस्वामिचरणानां
श्रीभारतीतीर्थस्वामिचरणानां च
चरणनलिनेषु श्रीवेङ्कटेश्वरविश्वविद्यालयीयैः

**सप्रश्रयं समर्पिता स्वागतपत्रिका**

स्वागतं व्याहरन् श्रीमद्गुरुभ्यो भक्तिनिर्भरम् ।
विश्वविद्यालयो धन्यमात्मानं मन्यते ध्रुवम् ॥

परमकारुणिकैः परमर्षिभिः
परमधर्मपथं परिदर्शितम् ।
जनततीरनुचारयितुं धृतं
विजयते भवदीययतिव्रतम् ॥

भारतीयाः कला विद्या भारतीः सुरभारतीम् ।
स्थापितोऽयं पुरस्कृत्य विश्वविद्यालयः किल ॥

अद्य श्रीचरणानां पादरजोभिः प्रभावितः सोऽयम् ।
भूयाज्जगतो भूत्यै सकलाया ज्ञानसम्पदो वृद्ध्यै ॥

तिरुपतिनगरे
पिङ्गल-कार्तिक-शुद्धाष्टम्यां
भृगुवासरे

श्रीचरणानामनुग्रहपात्रम्
श्रीवेङ्कटेश्वरविश्वविद्यालयीयाः



శ్రీశృంగేరీ శారదాపీఠాధిపతులతో
విశ్వవిద్యాలయ ఉపకులపతులు

"అవికల్పవిషయ ఏకః స్థాణుః పురుషః ప్రతో೽స్తి యః ప్రతిషు
ఈశ్వరముమయా నవరంవన్దే೽నుమయాపి తమధిగతమ్"

(శ్రీహర్షుని ఖండనఖండఖాద్య—మంగళశ్లోకం 1.)

పరివ్రాజకాచార్యవర్యులారా ! సోదరులారా ! శ్రీ ఆది శంకరాచార్యులవారు వేదాంతాన్ని భాష్యరచనలద్వారాను, మఠాల స్థాపనద్వారాను, ఇంకా అనేక విధాలుగా పరిపుష్టం చేసినది మన అందరికీ తెలిసిన విషయమే. వారు భారతదేశమంతా పర్యటించి, మన ధర్మరక్షణార్థం, ధర్మప్రచారార్థం విశేషమైన సేవ చేసి భారతీయ ఇతిహాసంలో మరెవ్వరిచేతా సాధింపబడని దేశ ఐక్యాన్ని, తత్త్వశాస్త్రవికాసాన్ని సాధించారు. వారు దేశం నలుమూలల స్థాపించిన నాల్గు ప్రధాన మఠాల్లో శృంగేరీమఠం ఒకటి. వారు లోకసంశీలనార్థం, స్వస్వరాష్ట్రాల ప్రతిష్ఠితికొరకూ, స్త్రీ పురుషులందరినీ ధర్మవిధేయులుగా వుంచడంకొరకూ ఈ చతుర్మఠాలను స్థాపించి, తమయొక్క ప్రధానశిష్యులను మఠాధిపతులనుగా నియమించి, వైదికధర్మానికి, శాస్త్రాలకీ రక్షణ కల్పించారు.

ఆ నాల్గు మఠాల్లో మొదటిదీ, చాలా గౌరవస్థానంలో వుండేదీ శృంగేరీమఠం. ఈ మఠానికి అధికారసీమగా ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటక, కేరళాలూ; అలాగే పూరీలోని గోవర్ధన మఠానికి

అంగ, వంగ, కళింగ, ఉత్కళ, బర్బర, మగధ దేశాలూ; అటు ద్వారకలో వున్న శారదామఠానికి సింధు, సౌవీర, సౌరాష్ట్ర, మహారాష్ట్రాది దేశాలూ; ఉత్తరాన వున్న జ్యోతిర్మఠానికి కురు, కాశ్మీర, కాంభోజ, పాంచాలాది దేశాలు అధికారసీమలుగా నిర్ణయించారు.

శృంగేరీమఠం, చరిత్రలో వహించిన పాత్రవలన, సంస్కృతభాషాభివృద్ధికి చేసిన సేవవలన, మన వేదశాస్త్రాలను ఉద్ధరించటానికి, ప్రచారం చేయటానికి చేసిన గొప్పకృషిద్వారాను జగత్ప్రసిద్ధి చెందిన మఠం. విజయనగరసామ్రాజ్యప్రతిష్ఠాపకులకు, తదనంతర పాలకులకు సలహా లివ్వడం, రక్షణ యివ్వడం. వారిని సరియైన ధర్మంలో నడిపించడంద్వారా ఎంతో కృషిచేసిన విద్యారణ్యాదులు ఈ మఠానికి అధిపతులుగా వుండినారు. విజయనగరాధీశ్వరులే కాకుండా, హైదరు, టిప్పుసుల్తానులు, తర్వాత వచ్చిన మైసూరు రాజులు, తదితరులూ కూడా, హిందూ ధర్మానికి చెందినవారైనా సరే, ఇతరులైనా సరే, ఈ మఠానికి అత్యధికమైన గౌరవం, ఆదరం ఇస్తూవచ్చారు. హైదరు, టిప్పుసుల్తానులు శృంగేరీపీఠాధిపతికి బంగారుకిరీటాన్ని, దానికి తగినటువంటి 'పోషాక్' ను బహూకరించి, వారిపట్ల తమ వినమ్రతనూ, ఆదరాన్నీ చాటారని నేను ఎక్కడో చదివాను.

శృంగేరీపీఠాధిపతులంటే నాకు విశేషమైన ఆదరం చిరకాలంనుంచీ వుంది. నేను — మీలో చాలామందికి తెలిసేవుండ

వచ్చు - ఎం.ఏ., లో అద్వైతవేదాంతం అభిమానశాస్త్రంగా తీసుకొనివుండడంచేత, తరువాత పిహెచ్.డి., కి అద్వైతవేదాంతంలోని శ్రుతిప్రామాణ్యవిచారం మీద విమర్శాత్మకమైన సిద్ధాంత గ్రంథం వ్రాసి ఉండటంవలన, 1954 నుంచి 1971 వరకు అద్వైత వేదాంతం ప్రత్యేక విషయంగా తీసుకొన్న ఎం.ఏ.. విద్యార్థులకు దానిని బోధిస్తూ వుండటంచేత, శ్రీ శంకరభగవత్పాదులు ప్రతిష్ఠించిన, సురేశ్వర విద్యారణ్యాదులు అధిష్ఠించిన శృంగేరీపీఠంపై నాకు అత్యంత ఆదరం, అభిమానం వుండడం సహజమే కదా! పదేండ్లక్రితం, జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు వాల్తేరుకు వచ్చినప్పుడు నేను వారిని సందర్శించటం, వారితో ఒకగంట ప్రసంగించటం, వారి సందేశం వినటం, నేను అడిగిన కొన్ని ప్రశ్నలకు వారిచ్చిన సమాధానాలపై వ్యాముగ్ధత చెందటం, జరిగింది. వారు యిటీవల హైదరాబాదులో వున్నప్పుడు ఒకనాడు వారిని దర్శించడం, మరొకనాడు వారి సన్నిధిలో జరుగుతూ వుండిన శాస్త్రార్థవిచారణసభకు హాజరై అది ఎలావుందో గమనించడం సంభవించింది. తర్వాత, యిటీవల మదరాసులో వారి షష్టిపూర్తి ఉత్సవాల్లో వారి సన్నిధిలో జరిగిన ఒక సదస్సుకు నేను అధ్యక్షుడుగా వుండి అద్వైతంపై ఉపన్యసించాను. అలా రెండుసార్లు కలిసినప్పుడు వారిని మన యూనివర్సిటీ చూడమని, యిక్కడ సంస్కృతం, తత్త్వశాస్త్రం, చరిత్ర, తెలుగు మొదలైన ప్రాచ్యవిద్యల (Oriental Studies) లోని కృషిని పరిశీలించి, మన విద్వాంసులను ఆశీర్వదించి, ఇది యింకా ఎట్లా

అభివృద్ధి చెందాలనే విషయంపై సూచన లివ్వమని ప్రార్థించాను. వారు దీనికి అంగీకరించారు. నేడిక్కడికి విజయంచేశారు.

ఈ సభ అపూర్వమైన సన్నివేశం అని నేననుకుంటాను. ఇదివరకు ఈ విశ్వవిద్యాలయానికి శృంగేరీపీఠాధిపతులు రావడం సంభవించలేదు. అనేక విశ్వవిద్యాలయాలకు కూడా వారు వెళ్లి వుండరు. బెనారస్, కర్ణాటక యిత్యాది మూడు, నాలుగు విశ్వవిద్యాలయాలకు మాత్రం వెళ్లి ఉపన్యాసా లిచ్చారని విన్నాను. అందుచేత, మన అందరి తరపున – సిండికేటు, ఉపాధ్యాయ వర్గాల తరపున – శ్రీ శృంగేరీ పీఠాధిపతులకు, వారి ప్రధాన శిష్యులు, ఉత్తరాధికారులు అయిన శ్రీ భారతీతీర్థస్వామివారికీ కూడా, మన అందరికీ తమ దర్శనం సమకూర్చినందుకు, తాము ప్రవచింపబోయే మహావిషయాలు వినే భాగ్యం కల్గించబోతున్నం దుకు కృతజ్ఞత తెల్పుతున్నాను.

ఈ సందర్భంలో మన యూనివర్సిటీ కాలేజీల ప్రిన్సిపాల్, సంస్కృతశాఖ అధిపతులు కృష్ణశర్మగారు వారికి సంస్కృతంలో స్వాగతపత్రాన్ని సమర్పిస్తారు, దాని తర్వాత శ్రీ స్వాముల వారిని తమ అమూల్య సందేశాన్ని యివ్వమని, మనం ఏ విధంగా ఇక్కడ యింకా భారతీయవిద్యల్ని అభివృద్ధి చేయగలమో, పోషింపగలమో సూచనలుకూడా యివ్వమని అభ్యర్థిస్తున్నాను.

ఓం నమః సర్వాణి భూతాని విష్టభ్య పరితిష్ఠతే ।
అఖండానందబోధాయ పూర్ణాయ పరమాత్మనే ॥

(రఘునాథ శిరోమణి, అనుమానదీధితి, శ్లో. 1.)

రఘువంశమనేటటువంటి కావ్యం సుప్రసిద్ధం. ఆ కావ్యంలో ప్రథమసర్గం అంతిమభాగంలో ఒక శ్లోకం వుంది.

నిర్దిష్టాం కులపతినా స పర్ణశాలాం
అధ్యాస్య ప్రయత పరిగ్రహద్వితీయః ।
తచ్ఛిష్యాధ్యయన నివేదితావసానాం
సంవిష్టః కుశశయనే నిశాం నినాయ ॥

(రఘువంశం, 1 - 95.)

దిలీపమహారాజులు వశిష్ఠుల ఆజ్ఞచేత పర్ణశాలకు పోయి విశ్రమించినారు. చెప్పవలసింది — అక్కడ వశిష్ఠునికి 'కులపతినా' అంటూ ఒక విశేషణం వేశాడు కాళిదాసుడు. ఏమిరా కులపతి అనే శబ్దానికి అర్థం ? ఏమిరా కులం ? అంటే దానికి పురాణములలోపల ఈవిధంగా నిర్వచనం చెప్పారు. శిష్యసహస్రములకు,

దశసహస్రశిష్యులకు అన్నపానాదులను పెట్టి విద్యను ఎవడు నేర్పుతూవుంటాడో వాడు 'కులపతి' అంటూ పురాణంలో వుంది. అంటే, దశసహస్రమనేటటువంటిది దశసహస్రమే సరిగా వుండాలని కాదు. అంటే ఏడువేలు, ఎనిమిదివేలుంటేకూడ దశసహస్రానికి యెక్కినట్లే అర్థం. ఇది ఎంతో పురాతనకాలంయొక్క వాక్యం. ఆ కాలంలోపలకూడానున్ను కులపతులు వుండిరి, అని మనకు తెలుస్తూవుంది. ఇప్పుడు అటువంటి కులపతులను చూడాలంటే ఇదిగో! ఈ విశ్వవిద్యాలయానికి ఎక్కడైనా రావాలి.

వెనక కులపతులు అరణ్యములోపల వుండేటటువంటి వారు. విద్య చదివేటటువంటివాళ్లకు ఏమి భావం వుండేదిరా అంటే, నేను మనుష్యుడుగా పుట్టాను. నాకు ఈ విద్య వంశ పరంపరగా రావలసింది ఆవశ్యకం. దానిని నేను నేర్చుకోక పోతే నేను ఋణగ్రస్తుడుగా వుంటాను. అనేటటువంటి భావం. ఏమట్లంటే, మనుష్యుడు పుట్టినప్పుడు మూడు ఋణాలతో పుట్టు తున్నాడట! దేవఋణం, పితృఋణం, ఋషిఋణం అన్నారు.

*"'జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిర్ ఋణై ఋణవాన్ జాయతే*
*యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః స్వాధ్యాయేన ఋషిభ్యః*
*ఇతి శ్రూయతే"*

(అని కుల్లూకభట్టు. మ, స్మృ. VI. 36.

ఎవరు మంత్రద్రష్టలో, ఎవరు ఆత్మసాక్షాత్కారాన్ని పొందినవాళ్లో, ఎవరు జ్ఞానులో వాళ్లు ఋషులు. ఆ ఋషులు ఏ విషయమైనా తెలిసికొని వ్రాసియుండవచ్చును. శాలిహోత్రుడు మహర్షి అంటాము. ఆయన వ్రాసింది అశ్వశాస్త్రం. మతంగ మహర్షి అంటాము. ఆయన వ్రాసింది గజశాస్త్రం. మరి చరకమహర్షిని గురించి చెప్పవలసిన పనిలేదు. ఆయన వ్రాసింది వైద్యశాస్త్రం. చాణక్యప్రభృతులు ఋషులని చెప్పకపోయినా ఋషికల్పులని పెట్టుకుందాము. చాణక్యుడు వ్రాసింది రాజనీతి శాస్త్రం, అర్థశాస్త్రం. వీళ్లంతా ఎందుకొఱకు యిటువంటి గ్రంథాలు వ్రాశారు? అంటే, భగవంతుడు వాళ్ల పుణ్యంవలన వారి కా జ్ఞానం ప్రసాదించాడు. ఈ జ్ఞానమనేటువంటిది నశించి పోరాదు. ఇది మానవజీవనమునకు సాధనం. సర్వదా వుండా లనేటువంటి భావంతో వ్రాశారు. ఇది అపరవిద్య మాట. ఇక, పరవిద్య అంటే, "అధ్యాత్మవిద్యా విద్యానాం" అంటాం. అన్నీ విద్యలే.

మనుమహారాజు విద్యల విషయాన్ని గూర్చి చెప్పినప్పుడు— "*లౌకికం వైదికం వాపి తథాధ్యాత్మిక మేవ చ*" అన్నాడు.

(మనుస్మృతి, ch. II, V. 117.)

విద్య మూడు రకాలుగా వుందయ్యా, లౌకికం, వైదికం, ఆధ్యాత్మికం అన్నాడు. ఆధ్యాత్మికమంటే షడ్దర్శనాలుకూడా ఆధ్యాత్మికవిద్యలే. అక్కడ ప్రపంచాన్నికూడా వాళ్లు చక్కగా

విమర్శించి దాని స్వరూపాన్ని నిర్ణయిస్తేను, వాళ్ల ప్రపంచంమీద ఎక్కువగా ఆసక్తి వున్నదని చెప్పలేమ ఆత్మస్వరూపాన్ని చెప్పాలి. అయితే, ప్రపంచాన్ని వదిలిపె ఆత్మస్వరూపాన్ని చెప్పితే ఎవరికీ యెక్కదు. అందుక ప్రపంచస్వరూపాన్ని విమర్శిస్తూ ఆత్మస్వరూపనిర్ణయంలోవ వాళ్లు పడే శ్రమకు వచ్చినారు. దానివలన, వాటికి దర్శనాల పేరు వచ్చింది, ఇంకా మనకు వెనక చెప్పినటువంటి శాస్త్రః లేవి ఉన్నాయో యిదంతా లౌకికశాస్త్రం. మన ఐహిక జీవనవ చక్కగా సాగించాలంటే ఈ శాస్త్రములుకూడా కావలసిందే. ర విద్యకూడా మనలో ఎంతో ముందంజవై చివుందనడానికి ఎన్నో గ్రంథములు దొరుకుతూవున్నాయి. రసతంత్రం అని తంత్ర కద్దు. అక్కడ కేవల రసాయనిక శాస్త్ర విమర్శన ఒక్కటే ఇంక వేరే విషయమేమీ లేదు. ఇంకొక విద్య వుంది అన్నాడ అది, "వైదికమేవ చ" అన్నాడు. మనము మన జీవనాని కేవలం యిప్పుడు ఏదో యాభై ఏండ్లు, నూరేండ్లు గడిపి మంటే పూర్తి అయినాము అని అనుకుంటే, మన వెనక వాళ్లు దానికి ఒప్పుకోలేదు.

*న జాయతే మ్రియతే వా కదాచిత్*
*నాయం భూత్వా భవితా వా న భూయః ।*
*అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో*
*న హన్యతే హన్యమానే శరీరే ॥*

(శ్రీమద్భగవద్గీత, II – 20

అంటూ, ఈ శరీరమునకు అతిరిక్తుడుగా ఒకడు వుండి, యిక్కడ ఈ శరీరాన్ని అవలంబించి, ఎన్నో పనులు చేసి, దానివెనుక తగినట్లుగా దాన్ని అనుభవించడానికి ఎన్ని జన్మాలనో ఎత్తుతున్నాడనేటటువంటిది మన సిద్ధాంతం. అటువంటి సిద్ధాంత ముండేటప్పుడు మనము ఏ కర్మ చేస్తే ఏ ఫలం వస్తుంది? అని నిర్ణయించాలంటే లౌకికంగా వుండేదాన్ని మనమే నిర్ణయించవచ్చు. అయితే, ఏ కర్మ జన్మాంతరంలో ఫలమివ్వబోతుంది? ఎటువంటి ఫలాన్ని యివ్వబోతుందంటే — ఒకణ్ణి మనం కొట్టినామంటే అది తప్పు, నేరం అవుతుంది. దానికి రాజు శిక్ష యిస్తాడు. రాజు శిక్ష యివ్వలేదు, అప్పుడు మనం గెలిచినట్లా? అంటే, మన శాస్త్రం చెబుతుంది — రాజు శిక్ష యిచ్చి, దానివలన నీకు దుఃఖం కలిగిందంటే నరకానికి పోనక్కరలేదు. లేకపోతే, మరల జన్మమైనా యెత్తి నీవు చేసిన నేరానికి ఫలం అనుభవించాలి. అంటే ఎవరూ నేరం ఏదిగానీ చేయకూడదు. ఇప్పుడు మనం ఏమనుకుంటూవున్నామంటే, ఏదో తప్పు చేశాము. మనం సర్కారుచేతికి చిక్కకపోతే గెలిచినట్లు అనుకుంటున్నాము. మన వెనకటివాళ్లు చెప్తారు, దీనికన్న పెద్దబాధలు అనుభవించవలసివస్తుంది అని. అదేరీతిగా మనం మంచిని కావాలంటే, మనం పెద్ద ఉద్యోగం కావాలని చదువుకుంటాము. సుఖంగా జీవించడానికి ధనాన్ని ఆర్జిస్తాము. అయితే మనకు ముందరకూడా జన్మముంది కదా! ఆ జన్మలోకూడా శ్రేయస్కరంగా జీవించాలి కదా! ముక్తిని

పొందాలంటే ఆ మాట వేరు. దానికి ఏంచేయాలంటే, మరి భగవదుపాసన చేయి. ఉపాసన నానారకం, కొందరు భగవంతుణ్ణి అగ్నిమూలకంగా, కొందరు మూర్తిమూలకంగా వుపాసన చేస్తారు. కొందరు కేవలం నామజపాన్ని చేస్తూ ఉపాసన చేస్తారు. కొందరు భగవంతుణ్ణి హృదయారవిందంలోపల చక్కగా చింతించి చింతించి వుపాసన చేస్తారు. అన్నీ వుపాసనలే. అయితే వానివాని అధికారాన్ని, వానివాని శక్తినిబట్టి. అందరికీ అన్నీ అన్వయిస్తాయని చెప్పడానికి లేదు. అది ఏది చేస్తే మనకు ఏ ఫలమొస్తుంది, అని తెలియాలంటే దానికి వేదమనే టటువంటిది ప్రమాణం. అక్కడ విశేషంగా అగ్నిమూలకంగా వుపాసన చెప్పారు. ఇంకా, వేరేదానికికూడా సూచకాలున్నాయి. ఎక్కువగా చెప్పలేదనుకోండి. అందుకు "వైదికమేవ చ".

"అధ్యాత్మవిద్య" అంటే మనకు తెలుసును. ఇటువంటి జ్ఞానమును మనకోసరం మన ఋషులు అది నశించిపోకుండా వుండడానికి గ్రంథరూపంగా మనకు అనుగ్రహించారు. మన తండ్రి మనకు మంచి ఆస్తులు పెట్టిపోయినప్పుడు ఆ ఆస్తిని సంరక్షించకుండా దానిని నశింపజేశామంటే మనము ఒకరకంగా పుత్రుడు అని పేరుపెట్టుకొని తిరగడానికికూడా అనర్హులం అని చెప్పుకొంటాం. ఋషులు ఇంత పెద్ద జ్ఞానాన్ని మనకోసరం అనుగ్రహించారు. ఆతట్టు మనము మనస్సునుకూడా త్రిప్పకుండా వున్నామంటే అప్పటికి మనం ఋణగ్రస్తులమే. ముందు జన్మములోనైనా మనం జన్మమెత్తి ఆ ఋణాన్ని తీర్చాలి, అని

చెప్పారు. ఈ ఋణాన్ని ఎలా తీర్చాలంటే మనకు ఆశ్ర మాలు కావాలి. అది యేదంటే వశిష్ఠుల ఆశ్రమం వుంది అన్నారు. ఇంకొక ఆశ్రమం వుంది అన్నారు. అక్కడకు వెళ్లి, మనం ఈ ఋణాన్ని తీర్చుకోవాల్నె. మనము మానవు లుగా పుట్టినామే, క్షత్రియులుగా పుట్టినామే అని అనుకొని ధను ర్విద్య నేర్చుకోవాలి. ఇంకొకడుగా పుట్టితే కర్మకాండ నేర్చు కోవాలి. లేకపోతే నా పుట్టు వ్యర్థం కదా! అనేటటువంటి భావంతో అతను పోయి వాళ్ల దగ్గర విద్య నేర్చుకుంటూవుంటాడు. క్షత్రియుడు లక్షణంగా అర్థశాస్త్రం నేర్చేవాడు. అయితే చెప్పే వాడు ఎవడైనా కావచ్చు. అశ్వపతి క్షత్రియుడు. బ్రాహ్మ ణులకు విద్య నేర్పాడట. ఎందుకంటే, ఎవరూ దొరకకపోతే వాడే కావచ్చు గురువు. అంటూ ఆ విద్యకు అంత ప్రాశస్త్యాన్ని ఉపనిషత్తుల్లోపల చెప్పివున్నారు.

*"ఆదదీత యతో జ్ఞానం తం పూర్వామభివాదయేత్"*

(మనుస్మృతి, ch. II. V. 117.)

ఎవరిదగ్గరైనా నీవు జ్ఞానాన్ని ఆర్జిస్తున్నావంటే ఆ జ్ఞానం నీవు పొందేవరకు వాణ్ణి గురువంటూ ఆశ్రయించాలి. వాడు ఏ విధంగానైనా ఉండనీ. అంటే ఆ గురువు కెంత ప్రాశస్త్య మిచ్చినారో తెలుస్తుంది. ఈయొక్క నియమాన్ని అవలంబించి వెనుకటి అందరు అధ్యయనపరంపరలో వుండిరి. అయితే ఆ పరంపర ఎక్కడికి పోయింది? అంటూ అడగవచ్చు. కాల

గర్భంలోపల అంతా అణగిపోతుంది అనేటువంటిది సహజం. పరదేశీయుల దండయాత్రలు జరిగినాయి. మనలోకూడా కొన్ని లోపాలు వున్నాయనుకోండి, అయితే అందరు తనకు తానే పెద్ద అనుకొన్నారు, పెద్ద అనుకుంటే, వాళ్లకు ఒక్కొక్కడు చిన్నగా కనిపించాడు. సమూహంగా చూస్తే మనమంతా వాస్తవంగా పెద్దే. అది కాలేదు. వారు ఆక్రమించారు. మన ఆశ్రమాలు పోయినవి. ఎంత కోశగ్రంథము లుండినాయో భగవంతునికే తెలుసు, పోయినవి. మిగిలినది కొద్దిగా వుంది. దానినైనా మనము సమగ్రంగా అధ్యయనము చేస్తాం అంటూ అభిమానపడదామంటే, ఇటువంటి గ్రంథాగారములు చూచినపుడు ఏమిరా! అనిపిస్తుంది.

వేదములోపల ఒక కథ వుంది. భరద్వాజుడంటూ ఒక ఋషి వుండేవాడట. వాడు వంద సంవత్సరములు విద్యాభ్యాసం చేశాడు. వార్ధక్యం వచ్చింది, పండుకొన్నాడు. దేవేంద్రుడు వచ్చి, "ఏమిరా నీకు కావాలి? పండుకున్నావే! ముసలివాడైపోయినావే!" అంటే "నాకు మళ్లీ బ్రహ్మచర్యంతో వుండి వేదాభ్యాసం చేయాలని ఆశ వుండడంవల్ల, నాకు శరీరంలోపల శక్తి రావాలి" అన్నాడు. "కానీ, తీసుకో" అన్నాడు దేవేంద్రుడు. ఒకటయింది, రెండైంది, మూడైంది. మూడయితేనూ పూర్తి కాలేదట! తర్వాత మళ్లీ ఇంద్రుడు వచ్చి "ఏమి కావాలి నీకు?" అంటే "మళ్లీ అదే కావాలి." "అయ్యో! దానివల్ల నీకేమీ ఫలము లేదురా! నేను అధ్యాత్మవిద్య తెలుపుతాను. ఆ విద్య నీవు సాధించావంటే అన్నివిద్యలూ నీకు వచ్చినట్లే పో!" అన్నాడు.

"అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్"

(శ్రీమద్భగవద్గీత, X - 32.)

అంటూ ఏ వస్తుస్వరూపం తెలుసుకొన్న తర్వాత, జగత్తంతా యింతే అనే నిశ్చయానికి మనము వస్తామో దానికి అధ్యాత్మవిద్య అని పేరు. ఒక వస్తుసత్త్వము లేకుండా ప్రపంచము మనకు కనబడదు. మన ఎదురుగా ఇంతగా కనబడుతూవుండే "మా" అంతా "మా" వలన కనబడుతూవుంది. "మా" లేదంటే లేదు. ఆత్మ సత్తులేనిది ప్రపంచములో సత్తా లేదు, అనేటటువంటిది శాస్త్రసిద్ధాంతము. ఒక చిన్న ఉదాహరణతో మనము తెలుసుకో వచ్చును. ఆత్మ మనము లేదనుకున్నా వుంది. ప్రపంచముందా, లేదా అంటే లేదన్నమాటే, మనము చూస్తేనే వుంది. లేకపోతే అంతే. మనదృష్టికి లేదు. వేరేవాళ్ల దృష్టికి వుంది. ఆ వేరేవాళ్ల దృష్టిలో నీవుంటే – నీవుంటేనే వేరేవాళ్లున్నారనేది. నీవే లేకపోతే వేరేవాళ్లున్నారని నీవు ఎట్లా చెబుతావు? దాని వలన, మనసత్తవల్ల ప్రపంచదృష్టిని చూస్తూవుంటాము. ఇంకా చక్కగా దానిని చింతించి చూచినామంటే ఒక ఆత్మ అనేటు వంటిది ఇన్నిరూపాలుగా మనకు కనబడుతూవుంది. మనము ఈ రూపమును ప్రత్యేక ప్రత్యేకముగా తెలిసికొని, కామక్రోధాదులను పెంచుకొని, వీడు నావాడు, వాడు పరాయివాడు, వాడు ఇంకొకటి అనుకొని, రాగద్వేషాదులను పెంచుకొని మనఃక్లేశము పొందు తున్నాము. అందుకు, ఒక వస్తువు సర్వత్ర చూడు.

"వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః"
(శ్రీమద్భగవద్గీత, VII-

వస్తువుగా చూచినదంతా వాసుదేవుడనుకో.

"త్వయి మయి చాన్యత్రై 9కో విష్ణుః
వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః"
(భజగోవిందస్తో

ఎందుకు నన్ను చూచి నీవు వూరికే ద్వేషిస్తున్నావు? ఒకే
మాత్మ అన్నిచోట్లానూ వున్నాడు. అనే దృష్టి మనకు :
మనలను ద్వేషం చేసేవాడు కూడా వుండడు. అంటే, ఒకే
మాత్మ దృష్టి వుండేటటువంటివానికి సర్వత్ర అభయప్రాప్తి.

"యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ య
(శ్రీమద్భగవద్గీత, XII –

వేరుగా మనం చూచినామంటే అప్పటికి భయం ఉండనేవు
ఆ పరమాత్మరూపంగానే చూచినామంటే పులిని చూస్తే
భయం లేదు. అంటే వాడు పరమాత్మరూపంగానే ష
చూచాడు. అంటే, పులినోట్లో పోయి కూర్చుంటాడని అ
కాదు. కూర్చోనక్కరలేదు. అదంటే ద్వేషంలేదన్నమ
పులి జీవనానికేమి? భగవంతుడు అడవిలో సృష్టించా
జీవించుకొనిపోతుంది. అడవిరూపంగా వచ్చింది. మనది ష

చేసుకొనిపోతున్నాము, అనేటటువంటి ఉదారభావం మనకు కలగడానికి అవకాశం వుంది. దానివల్ల అధ్యాత్మవిద్య; అధ్యాత్మ విద్య అంటే అత్యంత ఉత్కృష్టమైన విద్య. దాన్ని కనుగొన్నామంటే ప్రపంచమంతా ఈశ్వరసత్తనుండి సత్త కలిగింది. దీనికి వ్యతిరిక్తమైంది లేదు. అయితే ప్రపంచంలోపల జరిగేదంతా యథావత్తుగానే జరుగుతుంది. జ్ఞానికి, అజ్ఞానికి ఏమి తేడా వుంది అంటే, అజ్ఞాని ప్రపంచంలో వుండేటటువంటి వైచిత్ర్యాన్ని చూచి వ్యామోహపడుతాడు. జ్ఞానియైనటువంటివాడు

*"సవితరి శీతరుచౌ చన్ద్రే తీక్ష్ణేఽప్యధోరుచౌ వహ్నౌ*
*మాయికమిదమితి జానన్ జీవన్ముక్తో న విస్మితో భవతి"*

అన్నాడు. చంద్రునికి వేడి యెక్కితేను వీడికి యేమీ ఆశ్చర్యం లేదు. ఆ! అది యేదో గ్రహపరివర్తనముండవచ్చును. అదేమి అనుకొంటాడు వాడు, సూర్యుడే చల్లగా అయితేనుగూడా సరే, యిదికూడా ఒక పరివర్తనము కావచ్చు ననుకొంటాడు తప్ప, తన మనస్సుకు, దానివల్ల ఒక అద్భుతము చూచి వ్యామోహము పొందిన యితర మనుష్యులమాదిరిగా కలుగజేసుకోడు. అంటే ఘటాన్ని ఘటంగానే చూస్తాడు, పటాన్ని పటంగానే చూస్తాడు. ఘటం, పటం రెండూ ఒకటి చేసుకొని ఘటాన్ని తీసుకొని కప్పుకోవడానికి వాడు పోడు. అయితే, దీని సత్త యేదిరా అంటే అంతే. పరమాత్మసత్త లేకుండా దీనికి సత్తలేదు, అనేటటువంటి నిశ్చయం వుండడంవల్ల వానికి వుద్వేగం లేదు.

వాడికి వ్యామోహం లేదు. వ్యాకులత లేదు. ఇతరుల కంతా వుంటుంది. దానివల్ల, పరమాత్మవిద్యకు చాలా ప్రాశస్త్యం చెప్పారు.

ఆత్మవిద్య అంటే ఒక ఆత్మవల్ల ప్రపంచమంతా పుట్టింది. వాడే ప్రపంచాన్ని చూస్తున్నాడు. వాడే అనుభవిస్తున్నాడు. వాడే దుఃఖితుడు అనుకొన్నాడుకూడా. అయితే జ్ఞానం ఎప్పుడైతే వచ్చిందో తన స్వరూపాన్ని తాను కనుగొన్నాడో అంతా వాని స్వరూపం కదా! వాని స్వరూపమైతే నేమి? వాడే నేనైనప్పుడు. మనం ఒకనదిలో నీళ్లు త్రాగినప్పుడు నదిలో నీరు తీయగావుంది అంటాం. నది నీరు యావది? (శ్రీస్వాముల వారు ఇక్కడ 'యావది'? అనెడు కన్నడ పదప్రయోగం చేశారు. ఈ పదానికి 'ఎక్కడిది'? అని అర్థం.) నదినీరు కూడా సముద్రంనీళ్లే. సముద్రం లేకపోతే వర్షంలేదు. వర్షం లేకపోతే నది పుట్టడంలేదు. పుట్టకపోతే ప్రవహించదు. ఇప్పుడు మనం సామాన్యంగా ఏమనుకొంటామంటే నదినీళ్లు వేరు. సముద్రపునీళ్లు వేరు. సముద్రంనీళ్లు ఫిల్టరయి వచ్చిందంతే. సముద్రపునీళ్లు నదిరూపంగా ఫిల్టరయి వస్తే తీయగా వుంటుంది. లేకపోతే వుప్పగా వుంటుంది. అదేరీతిగా పరమాత్ముడు జీవ రూపంగా వచ్చినప్పుడు ఇన్నిరూపాలుగా కనబడుతూ వున్నాడు. వాడు తన స్వరూపాన్ని తానే కనుగొన్నాడంతే. ఇదే నది పోయి సముద్రం చేరిందంటే మళ్లీ సముద్రమే. మళ్లీ అదే రూపమే. దానికి వేరే రూపం లేదు. అందువల్ల, అధ్యాత్మ

విద్యకు, ప్రపంచంలో వుండే ఎంతపని చేస్తూవుంటేనూ, మనం నిర్లిప్తులుగా వుండుకొని పనిచేయడంలో ఉత్సాహశాలిగాను వుండి చేయడానికి అవకాశం వుంది. అయితే, దీనినుండి వచ్చే లాభ నష్టాలకు మనం ఏవిధమైన వ్యామోహాన్ని పొందకుండా మన జీవితాన్ని సక్రమంగా సాగించడానికి అవకాశముంది. అందుకు "అధ్యాత్మవిద్యా విద్యానాం" అంటూ భగవంతుడు చెప్పినాడు.

ఈ విద్యలన్నింట్లో 'అధ్యాత్మవిద్య' అనేటటువంటిది అందరికీ అవసరమైనది. అయితే, కేవలం ఆధ్యాత్మిక విద్య అంటే, వైదికం కాని, లౌకికం కాని, యిదంతా వదలిపెట్టి, అధ్యాత్మవిద్య అంటే అందరికీ సులభం కాదు. ఈ అధ్యాత్మవిద్యలోపలి రుచి వుండేటటువంటివానికి ఈ వైదికము, లౌకికము అనేది తలకు యెక్కనే యెక్కదు. దానివలన

*"రుచీనాం వైచిత్ర్యాత్ ఋజు కుటిల నానా పథ జుషామ్"*
(శివమహిమ్నస్తోత్రం, శ్లో. – 5.)

అని చెప్పినట్లుగా రుచివైచిత్ర్యంగా అన్నివిధములైన జ్ఞానాలను మనఋషులు సంపాదించిపెట్టిన ఆస్తి అనుకొని దానిని చక్కగా కాపాడవలెను. ఆవిధంగా ఆ శాస్త్రాలు అధ్యయనంచేసి వాటిని కాపాడితే ఋషిఋణం తీర్చినవాళ్లం అవుతాం. ఆ కాపాడవలె ననునటువంటిది వెనక కర్తవ్యనిష్ఠతో అందరికీ వచ్చినటువంటిది.

ఇప్పుడు, అంటే ఏదో కొందరు జీవికకొఱకు చదువుతూ వుంటారు. కొందరు ధనం సంపాదించడానికి చదువుతా

మంటారు. కొందరు వున్నారు. "ఎందుకండీ రెండు డిగ్రీలు తీసుకొన్నారు" అంటే – "డిగ్రీలు కాదయ్యా! దానిలోపల ఏముందో తెలుసుకోవాలి." అది వాస్తవికమైన జ్ఞానార్జనకు సాధనమంటే. ఇంకా మిగతావాళ్లు ఏమంటే మీదమీద తెలుసుకుంటే తృప్తి వస్తుందనుకుంటారు. అయితే ఏ జ్ఞానం సంపాదించాలన్నా యిటువంటి విశ్వవిద్యాలయాలు దానికి పోషక స్థానంగా వుండి జనులకు విద్యను అనుగ్రహిస్తూ వుంటాయి.

ఈ విశ్వవిద్యాలయాలకు అధిపతులుగా వచ్చేటటువంటి వాళ్లను 'కులపతి' అంటూ పిలుస్తూవున్నాము. వశిష్ఠమహర్షికి ఏ బిరుదము కాళిదాసుడు – కాళిదాసుడు కాదు, పురాణములోపల యిచ్చి, దాన్ని కాళిదాసుడు చెప్పాడంటారు.

*మునీనాం దశసాహస్రం యోఽన్నదానాదిపోషణాత్ ।*
*అధ్యాపయతి విప్రర్షిః సవై కులపతిః స్మృతః ॥*

(శబ్దకల్పద్రుమం, చూ: 'కులపతి')

అని పురాణశ్లోకం వుంది. 'శబ్దకల్పద్రుమం' అనేటటువంటి గ్రంథంలోపల ఆ పురాణశ్లోకాన్ని ఆలాగే తీసి వ్రాశాడు 'కులపతి' శబ్దానికి వ్యుత్పత్త్యర్థం వ్రాస్తూ. ఇప్పుడు మనకు దశ సహస్రం వుండేటటువంటి స్థానాలు దొరికేది కొంచెం కష్టమైతేనున్నూ సహస్రాధికంగా విద్యార్థులు వుండేటటువంటి విశ్వవిద్యాలయాలు వున్నాయి. అక్కడ వుండేటటువంటి 'కులపతులు' కూడా

చక్కగా అధ్యయనం చేసినవారే. అయితే, బహుమంది ఏమి చేస్తారంటే ఏదో భౌతికవిజ్ఞానమో, రసాయనవిజ్ఞానమో, లేదంటే అర్థశాస్త్రమో చక్కగా చదువుకొని కులపతులై వస్తారు. వాళ్లు వచ్చి జరుగుతూవుండేటటువంటి కళాశాలలు, విశ్వవిద్యాలయాలు చూస్తున్నాము. ఈ ఆధ్యాత్మికవిద్యలను చదువుకొని వచ్చి జరుగుతూవుండేటటువంటి విశ్వవిద్యాలయాలను చూస్తున్నాము. ఇక్కడ, అక్కడ ఏమి తేడా వుంది అంటే, ఇక్కడ అల్లరి లేదు. అక్కడ అల్లరి వుంది. పోనీ, ఏడాదినుంచీ చూస్తున్నాను. మా శృంగేరిలోపల రామకృష్ణా రావు అంటూ ఒకరున్నారు. ఆయన వేదాంతం చదువుకొన్న వాడు. అక్కడ మా గురువుగారిపేర కాలేజీ పెట్టాడు. ఆ కాలేజీలో ఆయన వుండేవరకు విద్యార్థులంతా చల్లగా వుండే వారు.

*"నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాత్ బ్రహ్మణి తే స్థితాః"*

(శ్రీమద్భగవద్గీత, V – 19.)

*"ఆత్మవత్ సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి"*

ఇదే బుర్రలో పారుతూవుంటుంది. ఎవరికి? ఈ వేదాంతం చదువుకొన్నవారికి. దానివల్ల, విద్యార్థులు అల్లరి చేస్తూవుంటే, 'నేనూ మీలో చేరినవాణ్ణిరా' అంటారు. 'నేనూ మీలో చేరినవాణ్ణి' అంటే ఎవరిమీద అల్లరి చేయాలి? ఈ కులపతిమీద అల్లరి

చేయాలంటే 'నేను మీలో చేరినవాణ్ణి' అంటే ఇద్దరూ అల్లరి చేస్తామా? ఒకడు చేయలేడు కదా! అనేటటువంటి భావంతో చక్కగా పాలిస్తూ వస్తూవున్నారు. నేను చూచాను. ఇప్పుడు ఆయన, మైసూరు యూనివర్సిటీలోపల వేదాంతం 'ఛైర్' వుంది, అక్కడ పెద్దస్థానంలో వున్నారు.

ఈ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సచ్చిదానంద మూర్తులు వచ్చినారు. పేరు ఎట్లా పెట్టారో నాకు తెలియదు. అదేమిటో ఆశ్చర్యం! "ఏవం పరబ్రహ్మలక్షణం సచ్చిదానందం అద్వైతస్వరూపం" అంటూ సచ్చిదానందమూర్తిగానే వచ్చి వున్నారు. స్వభావంకూడా ఆరీతిగానే అందరితోనూ కలుస్తారు. లేకపోతే నాబోటి సన్యాసిని తీసుకొచ్చి యిచ్చట కూర్చోబెట్టారంటే ఏమీలేదు. మమ్మల్ని చూస్తే ఎగతాళి చేసేవారు బహుమంది. ఏమి తెలియదురా, ఈ స్వాములవారు ఏమి మాట్లాడుతారు? అని చెప్పేవారు బహుమంది. ఇంక కొందరేమో, స్వామివారు డబ్బుకోసరం వచ్చారురా, పది రూపాయలు యిస్తే సంతోషపడుతారురా అనేవారు. అయితే, ఈ స్వాములుకూడా ఏదో ఒకవిధంగా జీవనంసాగిస్తూ వున్నారు. వాళ్ళుకూడానున్నూ దేశానికి చెడుపేమీ చేయరు. ఏమో మంచినే కోరుతున్నారని తెలిసికొనేవారు కొందరున్నారు. సచ్చిదానందమూర్తి అటువంటివారు. ఆయన హైదరాబాదుకు వచ్చారు. మదరాసులో కలిశారు. తిరుమలలో చూచారు. తనకు ఏదో ఒక శ్రద్ధ, ఆదరం కలిగితే దాన్ని ఎట్లాగైనా బయటపెట్టాలి అంటారు.

దైవికంగా నేను యిక్కడ వేంకటేశ్వర సన్నిధికి వస్తే "యిదే సమయం. స్వాములవారిని తీసుకొనివస్తా"మంటూ తీసుకొచ్చారు. నాకు చాల సంతోషం. (సరిగ్గా ఈసమయానికి గడియారం గంటలు కొట్టింది.) సత్యం, సరిగ్గా గంటలు ఆయన ఒకమాట చెప్పేటప్పుడు కొట్టింది. అది మంచిమాట. ఇప్పుడూ మళ్లీ అదే ప్రొద్దుకొచ్చింది. అంటే మనం పవిత్రమైన హృదయంతో, నిష్కపటమైన హృదయంతో ఏ పని చేస్తేనుకూడా దానికి భగవంతుడు వెంటనేవుండి సహాయం చేస్తాడు.

ఈ రీతిగా శ్రీ సచ్చిదానందమూర్తికాలంలో ఈ విశ్వవిద్యాలయం మన భరతఖండంలోపల ఆదర్శమైన విద్యాలయంగా వెలిగి అందరికీ మార్గదర్శకంగా వుండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. మళ్లీ యిక్కడ వుండేటటువంటి నిర్వాహకులు, విద్యార్థులు, మరి కార్యనిర్వాహకబృందములో చేరినటువంటి వాళ్లు—అందరికీకూడా భగవంతుడు ఆయురారోగ్యసంపదలు అనుగ్రహించి, విశ్వవిద్యాలయాన్ని చాల వున్నతస్థితికి తీసుకొని వచ్చి, అందరిని అనుగ్రహించుగాక! అంటూ భగవంతుని ప్రార్థిస్తున్నాను.

*నమః పార్వతీపతయే హర హర మహాదేవ!*
*జానకీకాంతస్మరణం జయ జయ రాం రాం.*



ప్రవచనం కావిస్తున్న శ్రీ భారతీతీర్థస్వామివారు

*శరదిందు వికాసి మందహాసాం స్ఫురదిందీవరలోచనాభిరామామ్ ।*
*అరవింద సమాన సుందరాస్యా మరవిందాసన సుందరీ ముపాసే॥*

వేంకటేశ్వరుని అనుగ్రహమువలన ఈ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము అత్యంత ఉన్నతస్థితిలో అలరారుచున్నది. ముఖ్యముగా ప్రాచీనకాలమునందు గురుశిష్యపరంపర ఎట్లుండెను? అన్న విషయమును మనము మన పూర్వజులు వ్రాసిన గ్రంథములను చూచినచో చక్కగా తెలియును. శ్రీచరణులు సెలవిచ్చినట్లు వశిష్ఠమహర్షియొక్క ఆశ్రమమును వర్ణించు సమయమున కాళిదాస మహాకవి —

*నిర్దిష్టాం కులపతినా స పర్ణశాలాం*
*అధ్యాస్య ప్రయతపరిగ్రహద్వితీయః ।*

అని పూర్వార్థమును చెప్పి —

*తచ్ఛిష్యాధ్యయన నివేదితావసానాం*
*సంవిష్టః కుశశయనే నిశాం నినాయ ॥*

(రఘువంశం, I–95 ॥శ్లో॥)

అనినాడు. అనగా ఆ కాలమునందు సమయమును తెలిసికొనుటకు యంత్రములు వుండియుండలేదు. కాని, బ్రాహ్మముహూర్తమునందు

లేవవలయునన్న నియమము మాత్రము అందరకును వుండియే యుండెను. దిలీపమహారాజు వశిష్ఠమహర్షి యొక్క ఆశ్రమమునకు విచ్చేసినప్పుడు ఆయన బ్రాహ్మముహూర్తమునందు లేచుటకు ఆయనకు సాధనము ఏది కనబడెననగా, వారి శిష్యులయొక్క అధ్యయనమే బ్రాహ్మముహూర్తమును తెలియజేసెనట :

"తచ్ఛిష్యాధ్యాయన నివేదితావసానాం"

తెల్లవారుఝామున నాలుగున్నరగంటలు అయిన సమయమందు శిష్యులందరు లేచి కూర్చొని పాఠములు చదువుచుండిరట. దాని వలన, యిప్పుడు బ్రాహ్మముహూర్తము అయినది; లేవవలయునని దిలీపమహారాజునకు తోచెనట : అనగా ఆ కాలమునందు శిష్యులు ఎట్లుండిరి ? అనుటను ప్రత్యక్షముగా చూచినట్లు వర్ణించినాడు కాళిదాసమహాకవి.

కాని, బ్రాహ్మముహూర్తమందు లేచి చదువుటలోగల ప్రాశస్త్య మేమున్నది ? అన్న ప్రశ్న విద్యార్థులకు వుదయింప వచ్చును. ఇదే ప్రశ్నను మనస్సునందు పెట్టుకొని అదే కాళిదాస మహాకవి మరొక్కచోట చెప్పినాడు.

అతిథిం నామ కాకుత్థ్సాత్ పుత్రమాప కుముద్వతీ ।
పశ్చిమాద్యామినీయామాత్ ప్రసాదమివ చేతనా ॥

(రఘువంశం, XVII – 1 శ్లో.)

అనినాడు కుముద్వతి యనగా శ్రీరామచంద్రునియొక్క కోడలు. కుశుని భార్య. ఆమె అతిథి యనెడు కుమారుని గనెను. కుశుని వలన అతిథియనెడు కుమారుని గనెను. ఎట్లనగా, రాత్రి చతుర్థ యామమునందు మనస్సునకు ప్రసన్నత ఎట్లు కలుగునో అట్లు అతిథి యనెడు కుమారుడు ఆమెకు వుదయించెను. అనగా, రాత్రి చతుర్థయామము మనస్సునకు ప్రసన్నతను కలిగించును, అను విషయమును "సిద్ధవత్కృత్య," సిద్ధముగా చేసుకొని చెప్పిన మాట. అది కేవలము శబ్దము మాత్రము కాదు. ప్రత్యక్ష— అనుభవమునందు గోచరముగా నున్న విషయము. ఈ రీతిగా విద్యార్థులు వుండవలయునని మన శాస్త్రములు వుద్ఘోషించు చున్నవి.

శాస్త్రములు చదువుటకు అధికారి ఎవరు ? అన్న ఒకానొక ప్రశ్నకు నిరుక్తకారులు చెప్పినారు.

*విద్యాహ వై బ్రాహ్మణ మాజగామ*
*గోపాయ మాం శేవధిష్టేఽహమస్మి ।*
*అసూయకాయానృజవేఽయతాయ*
*న మా బ్రూయాః వీర్యావతీ తథా స్యామ్ ॥*

(నిరుక్తమ్, II-1-4.)

అని విద్య బ్రాహ్మణుని దగ్గరకు వచ్చి నన్ను రక్షింపుమని కోరెనట। బ్రాహ్మణునకు ఆశ్చర్యము వేసెను. 'ఏమి నిన్ను రక్షించుటయనగా—? నిన్ను చక్కగా నేను అధ్యయనము చేసినాను.

అధ్యాపనము చేయుచున్నానే, ఇంతకంటె రక్షణ యనగా ని
మిటి ?' అన్నప్పుడు ఆమె చెప్పినది. "అసూయకాయ, అనృజ
అయతాయ న మాం బ్రూయాః." 'నీ వధ్యాపనము చేయుచున్నా
చక్కగా అధ్యయనము చేసినావు. ఆ విషయమునందు నాకేవె
ప్రసన్నత యుండియేయున్నది. కాని, నీవు అధ్యాపనము చేయ
చున్నప్పుడు పాత్రాపాత్రవివేకమునుమాత్రము చేయవలయున
"అసూయకాయ, అనృజవే, అయతాయ." ఎవరు విద్యావి
యమునందు శ్రద్ధను కలిగియుండడో అట్టివాడు "అసూయకః"
అసూయను చెందువాడు. "అనృజవే" – ఋజువర్తనము లే
వాడు "అనృజుః" అని అనబడును. ఋజువర్తన మనగా
మనోవాక్కాయములందు ఒకేరీతిగా వర్తించుట ఋజువర్తనము
అట్లుగాక, మనస్సునం దొకటి, మాటలయం దొకటి, చేతలయం
దొకటి, చేయువాడు ఋజువనబడడు. వక్రవర్తనము కలిగినవ
డగును. అట్టివానికి విద్యను చెప్పవద్దు' అనినది. ఏలననగా
గురువుయొక్క సన్నిధియందు విద్యాధ్యయనముచేయు వ్యక్తి
త్రికరణములను గురువును చక్కగా సేవించుచున్నప్పుడే ఆ విద్య
వానికి ప్రసన్న యగును. కాని, అట్లులేని పక్షమున విద్యామతల్లి
అనుగ్రహము వానికి కలుగదు.

అట్లే మూడవది – "అయతాయ" అనినాడు. "అయతః"
అనగా నియమములను పాటించనివాడు అని అర్థము. ముఖ్యముగా
విద్యార్థిదశయందు నియమములను పాటించుట అత్యావశ్యకమైనది.
విద్యార్థియొక్క నియమములు మొట్టమొదటిదిగా గురువువిషయము

నందు అత్యంతమగు గౌరవాదరములతో వర్తించుట కావుననే, వేదమునందొకచోట చెప్పునప్పుడు —

"నైవం విదుషాచార్యాంతేవాసినౌ। అన్యోన్యస్మై ద్రుహ్యేతామ్। యో ద్రుహ్యతి। భ్రశ్యతే స్వర్గాల్లోకాత్।"

(తైత్తిరీయారణ్యకమ్, I–6–3.)

అనినాడు. "ఆచార్యాంతేవాసినౌ అన్యోన్యస్మై న ద్రుహ్యేతాం." గురుశిష్యులు పరస్పరము ఒకరికొకరు ద్రోహము తలపెట్టకూడదు. "యో ద్రుహ్యతి భ్రశ్యతే స్వర్గాల్లోకాత్." ద్రోహమును తలపెట్టిన వానికి పతనము తప్పదు. అని అర్థము. ఇట్లు శ్రుతిమాత మనకు వుద్ఘోషించుచున్నది పదే పదే. కారణమేమనగా, గురుశిష్యులు ఎంత సౌమనస్యముతో అధ్యయన అధ్యాపనములను జరుపుదురో, విద్య వారిద్దరను అంత అత్యంతముగా అనుగ్రహించును. కావుననే ప్రాచీనకాలమునందు విద్యాధ్యయనమునకు ముందు శాంతిపాఠమును చదువు సంప్రదాయము అనాదికాలమున వచ్చియున్న సంప్రదాయము. శాంతిపాఠమునందు గురుశిష్యులిద్దరు చెప్పు వచనము —

"తేజస్వినావధీ తమస్తు
మా విద్విషావహై"

అనినారు. మాయొక్క అధ్యయనము తేజస్విగా— అనగా తేజోవంతముగా, వీర్యవత్తుగా వుండుగాక! "మా విద్విషావహై." పరస్పరము మనకు ద్వేషములు తగవు. నిన్ను నేను అత్యంత

త్ర్యము ఎప్పుడు కలుగుననగా, ఆ భాషను మన వ్యావహారిక జీవనమునందు అలవరచుకొన్నప్పుడే దానియందు స్వాతంత్ర్యము అబ్బును. కేవలము ఒకగ్రంథమును చదివినంతమాత్రముననో, అథవా, ఒకపత్రికకు వుత్తరము వ్రాసినంతమాత్రముననో భాషయందు స్వాతంత్ర్యము కలుగునని నేననుకొనుట లేదు. అనగా సంస్కృతభాషకు ఎట్టి ప్రాధాన్యమిచ్చి పూర్వజులు అసంఖ్యాకమగు గ్రంథములను సంస్కృతమునందు వ్రాసిరో, అట్టి ప్రాధాన్యమును మనమును యివ్వవలసియున్నదని నా అభిప్రాయము. అనగా, వ్యావహారికముగా సంస్కృతమునందే వ్యవహరింపవలెను.

మనము ఈనాడు తెలుగుభాషయందు వ్యావహారికముగా ఎట్లు వ్యవహరించుచున్నామో, అథవా ఆంగ్లభాషను అనేకులు వ్యావహారికముగా పెట్టుకొని, ఆ భాషయందు స్వాతంత్ర్యమును సంపాదించుచున్నారో, అదే రీతియైన స్వాతంత్ర్యమును గీర్వాణ భాషయందు సంపాదించుటకు మనమేల ప్రయత్నించరాదు? కాని, గీర్వాణభాష కష్టమను ప్రథ యొకటి యున్నది. కాని, అది నిర్మూలమైనదని అనేకులగు తద్జ్ఞులకు అవిదితము కాదు. అనగా భాషాంతరములందున్న క్లేశములు సంస్కృతమునందున్నచో వుండవచ్చును. అది యొక ప్రశ్నకాదు. భాషాంతరములకంటె క్లిష్టమను మాట మాత్రము తథ్యము కాదు. అట్లే క్లిష్టమున్నచో అసంఖ్యాకములగు గ్రంథములు సంస్కృతమునందు వుత్పన్నము లగుటకు సాధ్యమా?

అప్పయ్యదీక్షితులవారి పేరును మనము వినియున్నాము. వారికి "చతురధికశతప్రబంధనిర్మాణకర్త" యని పేరు. అనగా, నూటనాలుగు గ్రంథములను రచించిరని ప్రతీతి. వారి జీవిత కాలము సుమారు డెబ్బది సంవత్సరములు. వారే ఒకచోట

"వయాంసి మమ సప్తతేరుపరి నైవ భోగే స్పృహా"

అన్నారు. కాని, డెబ్బది సంవత్సరముల వయస్సునందుండి అనేకములగు యజ్ఞయాగాదులను అనుష్ఠించి, అనగా వాటి కన్నింటికిని సమయమును వినియోగించి, యిన్ని గ్రంథములను వ్రాయవలయుననగా ఆయనయొక్క హృదయమునందు సురసరస్వతి విషయమునందు ఎంత జాజ్జ్వల్యమానమగు శ్రద్ధావిశ్వాసము లుండియుండవలయునో అన్న విషయమును మనము ఊహింపవచ్చును.

శంకరభగవత్పాదులవారి జీవితమును పరికించినచో కేవలము ముప్పదిరెండు సంవత్సరముల ఆయుస్సు వారిది. ఆ ముప్పదిరెండు సంవత్సరముల ఆయుఃపరిమాణమునందు సమస్తభారతదేశమును కేవలము పాదచారియై రెండుమారులు ప్రదక్షిణముచేసి, దేశమునందున్న అవైదికమతానుయాయులను, విద్వాంసులనందరను వైదికమతానుయాయులుగా ఒనర్చిరన్నప్పుడు వారియొక్క వాదనపటిమ ఎట్లుండియుండవలెనో, వారి భాష్యగ్రంథములను చూచినచో వారికి తమ ఔపనిషదసిద్ధాంతమునందున్న శ్రద్ధ, ఉపనిషత్సిద్ధాంతమునకు భిన్నములగు మతములందలి దౌర్బల్య మెంత యున్నదన్న వారి తీర్మానము మనకు స్పష్టముగా

తెలియును. వారే ఒకచోట ఉపనిషద్భాష్యమునందు 'అనేకులగు ప్రతికక్షులు వారికి కలరు' అన్న ప్రతివాదియొక్క వాక్యమునకు జవాబు నిచ్చుచు —

> "ఏతదేవ మే స్వస్త్యయనం—యస్మాదేకయోగిన
> మనేకయోగిబహుప్రతిపక్షమార్థ। అతో జేష్యామి
> సర్వానారక్షే చ పంథామ్"
>
> (శంకరాచార్యుని తైత్తిరీయభాష్యం, II–VIII.)

అని ఉద్ఘోషించినారు. ఆ మహానుభావుని కున్న ఆ సాహసము కాని, ఆయన హృదయమునందున్న ఆ పరినిష్ఠితమగు జ్ఞానము కాని, ఆయనహృదయమునందలి సమస్తవిశ్వమునకు కల్యాణమును చేయవలయునను మహోన్నతమగు తలంపు కాని యింక యెవరికి వుండెనో నాకు తెలియదు. లేనిచో ఆ వ్యక్తినోటినుండి ఆ మాట వచ్చునా? ఇంతమంది ప్రతిపక్షులు నాకున్నారని అనుచున్నావు. అది నాకు మంగళకరము. "ఏతదేవ మే స్వస్త్యయనం" అనినాడు. అనగా, నన్ను ఒకడను ఎదిరించుటకు మీ రింతమంది వచ్చి కూర్చుంటిరే — అనగా మీ రింతమంది నన్ను 'జ్ఞాని' అనుకొని వచ్చితిరి కదా! మీరందరకు నేను సమాధానము చెప్ప గలను. ఔపనిషదమగు సిద్ధాంతమును ప్రతిపాదించగలను. అని ఆయన ఢక్కారావమును చేసి చెప్పినాడు. అనగా, ముప్పది రెండు సంవత్సరముల ఆయుస్సునందున్న శంకరభగవత్పాదులవారు ప్రస్థానత్రయభాష్యమును మాత్రమే వ్రాసి నిలువలేదు. వారి యొక్క స్తోత్రసాహిత్యమును తీసికొనినచో, దానిని చక్కగా

విమర్శనముచేయుటకు అనేకములగు సంవత్సరములు కావలయును. అనేకసంవత్సరముల కాలము విమర్శన చేయగలిగినంత స్తోత్రసాహిత్యమును అత్యల్పమగు ఆయుర్దాయమునందు తయారు చేసినారనగా ఆ మహానుభావునియొక్క జ్ఞానము ఎంత యుండి యుండెను? ఇంత మాత్రమే కాదు. ఆయనయొక్క హృదయమునందు తమ జీవితకాలమునందు కేవలము తమ దేశమునందున్న ప్రజలకు మాత్రము కల్యాణమును కలుగజేయవలయునన్న సంకుచితభావన కలిగియుండలేదు. 'సర్వకాలములందు ప్రజలకు కల్యాణము కలుగజేయవలయును. ప్రజలకు వైదిక ధర్మమునందు విశ్వాసమును కలుగజేయవలయును. ప్రజలను వైదికమార్గానుయాయులుగా జేయవలయును. ఔపనిషదమగు సిద్ధాంతము సర్వకాలములందును ప్రచారమునందుండవలెను' అన్న మహోన్నతమగు తలంపు ఆ మహానుభావుని హృదయమునందు కలిగినందువలననే ఆయన భారతమునందు నలుదిశలయందు నాల్గుపీఠములను స్థాపింపవలయునన్న సంకల్పము చేసినది. ఆదే రీతిగా స్థాపించినది. అనగా యిట్లు అటువంటి మహానుభావులందరును అన్నన్ని గ్రంథములను వ్రాసియుండుట సంస్కృత భాషయందే యన్నప్పుడు, సంస్కృతభాషకు వారెట్టి ప్రాముఖ్యము నిచ్చిరి? అన్న విషయమును మనము ఆలోచింపవలసియున్నది. వారు తమ వ్యవహారభాషగా సంస్కృతమును పెట్టుకొనియుండిరి. లేనిచో వారు మలయాళమునందు భాష్యమును రచించియుండ కూడదా? తమ మాతృభాష కేరళభాష. కేరళదేశమునందు

జన్మించినారు వారు. కాని, దానియందు వారు వ్రాయలేదు. సురసరస్వతియొక్క ప్రాచీనతను గుర్తించుట మనకంత అసాధ్యమైనది కాదు. సురభాషయందు ఉపలబ్ధములగు గ్రంథములు మిగిలిన భాషల అన్నింటికంటే ప్రాచీనములన్న విషయము పాశ్చాత్యులుకూడా అంగీకరించినదే. అట్టి ప్రాచీనమగు భాషను కాపాడుకొనిరావలసిన అవశ్యకత మనయందున్నది. దానికి వుపాయమేమి? మనము మన వ్యవహారమందుగూడా సంస్కృతమును వుంచుకొనవలయును. ఈనాడు మనదేశమునందు అనేకులకు సంస్కృతమును అభివృద్ధిచేయవలయునన్న భావనయున్నది. సంస్కృతాభిజ్ఞు లనేకులు ఆ విషయమందు పరిశ్రమను వహింప నిచ్ఛగించువారున్నారు. మా శిష్యుడు పుణ్యపత్తనము (పూనా) నందుండువాడు వసంతరావుగాడ్గేల్ అను వ్యక్తి. సంస్కృతమును ముందుకు తీసికొనిరావలయుననుటకు అనేకములగు పాట్లు పడుచున్నాడు. కాని, ఒకవ్యక్తితో జరుగుపని కాదది. అరవైకోట్ల ప్రజలు కలిగిన మనదేశమునందు అటువంటి మహోన్నతమగు కార్యమును ఒకవ్యక్తి సాధించగలుగునా? సాధించలేడు. కాని, ఆ కార్యము వానికొక్కనికి మాత్రమే అయియున్నదా? కాదు. మన అందరియొక్క పనియే అది.

నా అభిప్రాయము విశ్వవిద్యానిలయమునందున్న విద్యార్థులు, అధ్యాపకులు సంస్కృతభాషకు విశేషమగు ప్రాధాన్యము నీయవలయును. ఇచ్చుచునేయున్నారు. కాని, దానిని వ్యవహారభాషగా పెట్టుటకు ప్రయత్నించవలయును. అది మనకు

సాధ్యమా? అసాధ్యమా? అన్న విషయము నాకు తెలియదు. కాని, నా అభిప్రాయము ఒక్కరే ఈ ప్రయత్నము చేయుట యన్నది అసాధ్యము. అనేకులు కలిసి యే పనిని చేసినను ఆ పని సిద్ధించును. ఒక చీమ మాత్రము ఒక సర్పమును, ఒక యేనుగును ఏమి చేయలేదుగాని, "బలవంతమైన సర్పము—" అను ఒక పద్యమును వినుచునేయున్నాము. ఉత్తరార్ధమును ఎందుకు చెప్పుట యని విడిచినాను. అనగా "సంఘే శక్తిః కలౌ యుగే" అను న్యాయము ఈనాడు పుట్టినది కాదు. 'అందరును గుమిగూడి ఏ విధమైన పనినైనను సాధింపవచ్చును' అన్న నగ్న సత్యము ఆ న్యాయమం దిమిడియున్నది.

కావున, ముఖ్యముగా మన భారతీయవిద్యలను, సనాతన ధర్మమును యింకను అభివృద్ధిచేయవలయునన్న తలంపు మా ఉపకులపతి యగు సచ్చిదానందమూర్తి గారి హృదయమునందు వచ్చినది. ఇది విశ్వవిద్యాలయముయొక్క ఔన్నత్యమునకు ఒక హేతువని నే ననుకొనుచున్నాను. వారియొక్క హృదయమునందు మన భారతీయ విద్యలయందు, సనాతనధర్మవిషయమునందున్న శ్రద్ధ ప్రశంసనీయమైనది. లేనిచో శ్రీచరణులు సెలవిచ్చినట్లు, మావంటి సన్యాసులను యిచ్చటికి పిలుచుటగాని, ఉపన్యాసములు చేయించుటగాని సామాన్యులకు సంభవించదు. సనాతనవిద్యల యందును, వైదికధర్మమునందును, ఔపనిషదమగు తత్త్వము నందును ప్రశంసనీయమగు శ్రద్ధ కలిగినవారికే అది సాధ్యము. వారట్టి శ్రద్ధావంతులు. కావుననే, ఈనాడిట్టి కార్యక్రమమును

ఏర్పరచినారు. వారియొక్క హృదయమునందున్న కోరిక వేంకటేశ్వరుని అనుగ్రహమువలన ఫలవంతము కావలయునని ఆశించుచున్నాను. శ్రీచరణులకు వారియొక్క విషయమందు అమితమగు అనుకంప. వారు భాగ్యనగరమందును, మద్రనగర మందును శ్రీచరణులను దర్శించినపుడు నన్నుకూడ పిలిచినారు. ఇంతకు పూర్వము శ్రీచరణులను దర్శించి కామితార్థములను బడసినారు. కావున వారియొక్క సత్సంకల్పము శ్రీచరణుల అనుకంపవలన పూర్ణమగుగాక ! యని నేను ఆశించుచున్నాను.

ఈనాడు శ్రీచరణుల అనుగ్రహభాషణమైన పిదప అంతటితో ఈ కార్యక్రమము ముగియునని నే ననుకొంటిని. కాని, సచ్చిదానందమూర్తిగారియొక్క అభిలాషవలన నేనుకూడ ప్రసం గింపవలసివచ్చినది. ప్రసంగించినచో ఎంతో సమయము పోవును గాని, కార్యాంతరము ఉన్నందున యిచ్చట ముగించవలసివచ్చు చున్నది. సమయాంతరము వచ్చినప్పుడు ఎక్కువ సమయము ప్రసంగింపవచ్చును. నేడుమాత్ర మిచ్చట ముగింప నిచ్ఛగించు చున్నాను

శ్రీచరణుల అనుగ్రహమువలన విశ్వవిద్యాలయము అత్యంతముగా అభివృద్ధికి వచ్చుగాక ! విశ్వవిద్యాలయమందున్న విద్యార్థులు, అధ్యాపక బృందము, శ్రీచరణుల కటాక్షమువలన సకలశ్రేయస్సులను బడయుదురుగాక ! యని ఆశించుచు ఉపన్యాసమును ముగించుచున్నాను.



S.V.U. ORIENTAL SERIES No. 7

*General Editor*

PROF. S. SANKARANARAYANAN

# GURUŚIṢYASAMBANDHĀLU
# PŪRVĀDARŚĀLU, PRASTUTAPARISTHITULU

*Lectures by*

Śrī Śaṅkarācāryas of Śṛṅgeri Maṭh

ORIENTAL RESEARCH INSTITUTE
SRI VENKATESWARA UNIVERSITY
TIRUPATI, 1978